# చిత్రకథలు

4 వ భాగము.

---

గ్రంథకర్త:

నిడమర్తి సత్యనారాయణమూర్తి, బి. ఏ., బి. ఇ. డి.

ప్రకాశకులు:

వేంపాటి వెంకటేశ్వరరావు అండు కో.,

కైకలూరు,
కృష్ణా జిల్లా.



వెల 0—4—

# విజ్ఞప్తి



నాల్గవ తరగతి విద్యార్థులు దీనిని చదివి స్వయముగ అర్థముచేసికొనవలెనని మాతలంపు. అందుచేతనే సంధికలుపకుండ పదములను విడదీసి వ్రాసినాము. ఇందలికథలు పసివారి మనస్సులను సులభముగ ఆకర్షించి ఉన్నతభావములను పుట్టించునట్టివి. దీనిమూలమున బాల్ర బాలికలకు పఠనాభిలాష కలిగినచో మా ఉద్దేశము నెరవేరినదగును.

# విషయసూచిక.

## 4 వ భాగము.

# 1. మంగలి—గాడిద.

బాగ్దాదునగరమున మంగలివాడొకడు గలడు. అతడు నిపుణుడగు పనివాడగుటచే ఆనగరమునందలి పెద్దమనుష్యు లందరు నాతనియొద్దనే క్షౌరము చేయించుకొనుచుండిరి. అందుచే అతడు ధనవంతుడై ప్రత్యేకముగా ఒకకొట్టుపెట్టెను.

ఒకనాడొకడు గాడిదపై కట్టెలమోపులనువేసికొని అమ్మకమునకు బజారువెంట తిరుగుచుండెను. ఈ మంగలి వానినిపిలిచి, ఆకట్టెలను బేరమాడతొడగెను. గాడెదపైనున్న కట్టనంతను మంగలివాడు రెండురూప్యముల కడిగెను. వాడందులకీయకొని కట్టెలను క్రిందికిదింపెను. కట్టెలు గాడిదకు నొప్పికలిగింపకుండుటకుగాను కొయ్యతో చేసినజీనును వాడు దానిపై వేసెను. దానినిగూడ తనకమ్మినదేయని మంగలి వాడు తగవుపెట్టెను. గాడిదపైనున్న కట్టెలనుమాత్రమే బేర మిచ్చితినని కట్టెలమ్మువాడనెను. గాడిదపైగల కట్టనంతను నేను బేరమాడితిని, అందుచేత జీనుగూడ నాదేయని మంగలి యనెను. ఇరువురును న్యాయస్థానమునకు పోయిరి. అక్కడ మంగలికి అనుకూలముగ తీర్పునిచ్చిరి.

మఱికొన్నిదినములకు ఆకట్టెలమ్మువాడు మంగలి కొట్టునకువచ్చి "అయ్యా! నాకును నాస్నేహితునకును పనిచేయుటకేమి పుచ్చుకొందు"వనెను. వాడర్ధరూపాయి అడిగెను. అందునకు వాడియ్యకొని ముందుగతాను క్షౌరము చేయించు

కొనెను. అటుపిమ్మట మంగలి "నీస్నేహితుని తీసికొని ర"మ్మనెను. అపుడు వాడు మెల్లగలేచి ఆసమీపముననే చెట్టునకు కట్టబడియున్న గాడిదను తీసికొనివచ్చి నిలబెట్టెను. అదిచూచి మంగలి పట్టరానికోపమున "వీడా నీస్నేహితుడు? నేను రాజాధిరాజులకు పనిచేతును. గాడిదకెట్లుచేతును? చేయను పొమ్ము" అనెను.

అంతట వాడు న్యాయస్థానమున పిర్యాదుచేసెను. న్యాయాధిపతి సంగతిఅంతయును విని మంగలితో ఇట్లనెను "ఓయి! నీవితనికిని ఇతనిస్నేహితునకును పనిచేయుట కొప్పుకొంటివి. ఆస్నేహితుడెవరోనీవడగనులేదు, అతడు చెప్పనులేదు కనుక ఆగాడిద కొడలంతయు సబ్బుపూసి నీవు పనిచేయవలసియున్నావు. మాసభయెదుట నీవాపని చేయవలెను".

ఆమంగలి గత్యంతరములేక న్యాయాధిపతి ఆజ్ఞచొప్పున గాడిదకు క్షౌరక్రియలు జరిపెను. ఊరిలోనివారందరు నావింత తిలకించి పెంకిమంగలికి తగినశాస్తి అయినదనుచు సంతసించిరి. మంగలివాడును బుద్ధితెచ్చుకొని మెలగజొచ్చెను.

కుక్కకాటునకు చెప్పుదెబ్బ.

---

# 2. అవసరముమాలిన పని



పూర్వకాలమున నొక యూరిదగ్గరగల తోటలో ఒక యజమాని కట్టలు కోయించుచుండెను. మధ్యాహ్నమగునప్పటికి పనివాండ్రు భోజనమునకై పోవనుండిరి. వారొక దూలమును సగమువరకును కోసి అది మూసికొని పోకుండునటుల. దానియందొక గసిక కొట్టి వెడలిరి.

పనివారింటికి పోయిన వెంటనే దాపునగల చెట్లపై నున్న కోతులా దూలమువద్దకువచ్చి ఆకట్టను కదుపుచు, ఈకట్టను

లాగుచు అల్లరిచేయసాగెను. అందుచేతనే అల్లరిచేయువానిని కోతిపనులు చేయవలదని మనవారందురు.

అందొకకోతి సగముకోసిన దూలముపై కూర్చుండి గసిక పట్టుకొని లాగదొడంగెను. కూర్చున్నపుడు దానితోక యును ఒక పిఱ్ఱయును పగులులో పడియుండెను. గసిక గట్టిగా నుండుటచే ఊడిరాదయ్యెను. తానులాగునపుడది రాకుండుట చే మర్కటము కోపించి బలమునంతను వినియోగించి గసికను లాగెను. ఎట్టకేలకు గసిక ఊడివచ్చెను. అది పైకివచ్చినంతనే దూలముయొక్క చీలికలు దగ్గరకు చేరెను. కోతియొక్క తోక యును, పిఱుదును, అందిరుకుకొనుటచే బాధకు తాళచాలక వానరము చచ్చెను. అవసరములేనిపనిలో జోక్యము కలుగ చేసికొనువారందరును కోతివలెనే అగుదురు.

అవసరముమాలినపని చేయకూడదు.



## 3. మందబుద్ధి.

గార్గ్యుడను విప్రుడొకడు వనములో దుర్గనుగూర్చి ఘోరతపము చేసెను. అతనిభక్తికిని, నిష్ఠకును అంబికమెచ్చి వానికి ప్రత్యక్షమై నీకు కావలసిన వరమడుగుమని అతనితో ననెను.

ఆమె వరమడుగుమని నంతనే ఆబ్రాహ్మణుడు మిక్కిలి సంతసముతో నమస్కరించి "హేజననీ! నాకు సంజీవని ఒసగుము" అని వేడెను. ఆయమ్మ అతనిచేత కొన్ని పచ్చని ఆకులునిచ్చి "నాయనా! ఇవి యెండవు. తరుగవు. వీని రసమును పైన చల్లినంతనే శవములకు ప్రాణమువచ్చి మునుపటితీరున నుండును." అనిచెప్పి మాయమయ్యెను.

ఆబ్రాహ్మణు డాయాకులను గొని ఆకానలో తనగ్రామమునకై పునకు తిరిగి పోవసాగెను. దారిలో అతనికి చచ్చిన పెద్దపులి యొకటి గోచరించెను. దానిని చూచినంతనే వానికి సంజీవనీమహాత్మ్యమును పరీక్షింపవలెనని బుద్ధిపుట్టెను. వెంటనే వాడు పులియొక్క శవముదగ్గరకు పోయి సంజీవనీరసమును దానిపై పిండెను.

ఆరసము దానిపై పడినంతనే గాండ్రుమనుచు పులి లేచెను. బ్రాహ్మణుడు భయముతో ఒడలు తెలియక పారిపోవుటకు కాళ్లాడక నిలచెను. వానిని పులిపట్టుకొని చంపితినెను.

మతిలేని వారు విద్యావంతులయినను లాభములేదు.

# 4. పిచ్చుక - వానరము.



ఒకానొక కాననమున ననేకఫలములతోనిండిన చెట్టు కలదు. ఆవృక్షముపై నొక బంగారుపిచ్చుక గూడుకట్టుకొని భార్యతోకలసి సుఖముగ కాపురము చేయుచుండెను. ఆవృక్షముపై ననే నివసించు వానరమునకునీపక్షులకును స్నేహాము మెండు.

ఒకనాటిరాత్రి నీలమేఘములాకాశమునంతను క్రమ్ముకొనికన్నుకాన కుండ చేసెను. ఇదిచూచి యందలిమగపక్షి తమగూటిలో రేగడిముద్దనుపెట్టి దానికి మిణుగురుపురువు నంటించెను. అదిదీపరేఖవలె మెరయుచు ఆగూటికి కాంతిని ఇచ్చుచుండెను.

ఇంతలో బ్రహ్మాండమగు వర్షముకురియ నారంభించెను. ఆపక్షులు రెండును తాము కష్టపడి కట్టుకొనినగూటిలో దూరి సుఖముండెను. వానరుడు పాపము వర్షమునకు తడియుచు దుఃఖించుచుండెను. స్నేహితుని కష్టపాటుచూచి విహగము లుకూడా కషునొచ్చుకొనెను.

అపుడు మగపక్షి గూటిముంగలకువచ్చి సఖుడగుకోతి తో "మిత్రమా, నీవుపడకుచున్నావు వర్షమాగునట్లు కన్పింపదు. రాత్రియుగముగా తోచుచున్నది. ఎపుడుతెల్లవారునో ఎపుడునీకష్టము గట్టెక్కునో నామనసు నిలచుటలేదు. నాగూటి లోనికరమ్మందమన్న ఇది సన్నమగుటచే నీకు సరిపడదు. నేను నీకు హితుడనన్నమాటయేగాని అవసరసమయమున ఉప యోగింపకుంటిని. నాబ్రతుకుకేమిలాభము? అకట! నీవు కుంటి వాడివిగావు గ్రుడ్డివాడివిగావు, నిలచుటకు నీడనైననుచేసికొన వైతివి. చేసికొన్నచో నీకీ కష్టముండదుగదా?" అనుచు విచారించెను.

ఆపలుకువిని దుర్మతియగు వానరుడు "పీడు తానును భార్యయును సుఖముగ గూటిలోనున్నామని గర్వించి నన్ను వెక్కిరించుచున్నాడు. గూటిలోనున్న దీపముదగ్గర చలిగాచు కొమ్మని యయిననుఅనడు. దీనిక్రొవ్వుఅణచెదను" అనుచు తలచి ఆగూడునున్నకొమ్మనువిరచి నీటపారవైచెను. ఆపక్షులు రెండు తమకువచ్చిన కష్టమునకు వగచుచు మరొకచోటునకు బోయెను.

వివేకహీనులతో చెలిమి ఆపదకు కారణము.

# 5. కిరాతుడు — చిలుక

ఒక మహారణ్యమున నున్నతవృక్ష మొకటికలదు. దానిపై ఒకచిలుక గూడుకట్టుకొని అందు రెండుగ్రుడ్లను పెట్టి పిల్లలనుచేసి, ప్రేమతో పెంచుచుండెను.

ఒకనాడు కిరాతుడొకడాదారి నేగుచు చిలుకయొక్క గూటిని చూచెను. వాడు వృక్షమునెక్కి అందున్న రెండుపిల్లలను చేతపట్టుకొని క్రిందికి దిగనుండెను. ఆకీరమదిచూచి దుఃఖించుచు వానితో ఇట్లనియెను. "అయ్యా! ప్రపంచమున పక్షులనేకమున్నవి. ఇవి కండ్లు తెరువని శిశువులు. వీనిని తినినచో రుచియూ ఉండదు. కడుపూ నిండదు. కనుక దయామయుడవై నాపిల్లలను విడువుము."

బోయవాడు శుకముతో నిట్లు బదులుచెప్పెను. "ఓశుకమ! నేను వీనిని మాంసమునకై చంపను. వీనిని అంగడిలో నమ్మెదను. ఎవ్వరైన వెలయిచ్చి కొంపోయి పెంచుకొందురు. నీవు విచారింపకుము".

"ఓ కరుణాకర! నీవు డబ్బు ఆసించి నాపిల్లలను కొంపోవుచున్నావా? అటులైన నేను నీకెంతతీసినను తరుగని బంగారమును చూపింతును. నాపిల్లలను నాగూటిలో వదలుము" అని చిలుక పలికెను.

బోయవాడు ధనముపై గల ఆశచే మరల చెట్టెక్కి పిల్లలను గూటిలోనునిచి బంగారమున్న చోటు చూపుమని కర

ము నడిగెను. అపుడది వానితో నిట్లనెను "ఆవెలగచెట్టునకు మొదట తొఱ్ఱికలదు. ఒకవిప్రుడు దొంగలభయమున తన కున్న బంగారిమంతయు దానిలో దాచిపోయెను. నీవుపోయి అందుచెయిపెట్టి తీసికొమ్ము."

బోయడది నిజమనియెంచి చెట్టును సమీపించి తొఱ్ఱలో చెయిపెట్టెను. వెంటనే అందున్న నల్లత్రాచు వానిని కఱచెను. వాడా విషము వెంటనే తలకెక్కుటచే క్రిందపడుచు "ఓచిలుక! నన్నిట్లు మోసముచేయతగునా?" అనెను.

"ఓయి! నీవు దుర్మార్గుడవు. నీవలన అనేకప్రాణులు దుఃఖించుచున్నవి. నీయట్టివాని నెట్లువంచించినను పాపములేదు. నీవిక పాపములు చేయజాలవు. పరలోకమున సుఖింతువుగాక!" అని చిలుకపలికెను. దుర్మతియగు బోయ మరణించెను. చిలుకపిల్లలనుగూడి సుఖంబుగనుండెను.

బుద్ధిమంతులు తమశత్రువులను ఇతరులసాయమున జయింతురు.

---

# 6 పరమలుబ్ధు.



దండకారణ్యమున ముదిసి బలహీనమైన పులి ఒకటి ఉండెను. అది వేటాడి జంతువులను చంపలేకుండెను. పరుగిడలేకున్నవారినిమాత్రము మాయోపాయముచే పట్టుకొని చంపి తినుచుండెను.

ఇటులుండ ఒకనాడాదారిని పరమలోభియగు ఒక బ్రాహ్మణుడు పోవుచుండెను. పులి అతనిని చూచి "ఓ బ్రాహ్మణోత్తమ! నీవు సద్బ్రాహ్మణుని చందమున కన్పించుచున్నావు. నీకు సువర్ణదాననుచేసి పుణ్యము సంపాదింపవలెనను కోరిక

నాకు కల్గినది. కనుక ఈకొలనులో స్నానమాడిరమ్ము" అని పలుకుచు తన చేతనున్న బంగారుకంకణమును చూపెను.

కాంచనమనిన అతనికి కాంక్షమెండు. పులి క్రూర మృగము, అదేమి మోసముచేయునోయని అతడులోలోనచాల భయపడెను. అందుచే అతనిమనసు ముందువెనుకలకు ఊగుచుండెను. కాని ఆసువర్ణకంకణమును చూచినకొలదిని ఆబ్రాహ్మణునకు భయము తగ్గుచు ఆశహెచ్చుచొచ్చెను. చిట్టచివరకతడుభయమును అడచుకొని స్నానముచేసి కడియమును తీసికొనుటకు నిశ్చయించుకొనెను.

తరువాత ఆతడు స్నానమాడుటకు కొలనులోదిగెను. కాని అది ఊబిగానుండుటచే అతని కాలందులో దిగబడెను. బ్రాహ్మణుడు సులభముగ పైకి రాజాలకపోయెను. అపుడతడు తానుచేసిన అవివేకమునకు చింతింపసాగెను.

పులి అతని నిస్సహాయస్థితి తెలిసికొని కంకణమును గట్టుపైపెట్టి బ్రాహ్మణునిపైకి ఉరికి "ఓయి బంగారుకడియము నకుబదులు నీకు స్వర్గమునిప్పింతును చూడుము" అనుచు నతనిని పట్టి చంపి తినెను.

లోభగుణము ప్రాణహాని తెచ్చును.

---

# 7 ఆడినమాట తప్పని ఘనుడు

సైనికు డొకడు వీధివెంబడి పోవుచు ఒకమహమ్మదీయునితో తగవులాడెను. మొదట మాటలతో ఆరంభమైన వారితగవు చేతులు కలుపుకొనుటవరకును వచ్చెను. ఆగ్రహముచే ఒడలుతెలియక మూర్ఖుడగు నాసైనికుడు వానిని కత్తితో పొడిచి చంపెను. అది చూచుచున్న వారతని దుష్టత్వమునకు కోపించి అతనిని పట్టుకొన యత్నించిరి. సైనికుడు వారిని ఎదిరింపచాలక కాలికొలది పరుగెత్తి రహస్యముగ ఒక తోటలో ప్రవేశించెను.

ఆతోట యజమానియగు మహమ్మదీయు డాసమయమున తోటలో ఉండెను. సైనికుడు భయముతో నాతనిదగ్గరకు పోయి తాను చేసిన తప్పిదమును సవిస్తరముగ చెప్పి శరణు వేడెను. దయాళుడగు ఆముసల్మానుడు వానిపై చేయినిడి భయములేదని చెప్పెను. అప్పటికిని సైనికు డనుమానించుట చూచి అతడు వాని కొకఫలము నిచ్చి "మా యాచారము ననుసరించి అతిథిని సర్వవిధముల కాపాడుదుము. నీవు భయములేక యుండుము" అనెను. అతడు సైనికుని ఒకరహస్యప్రదేశమున దాచెను.

అతడంతట ఇంటికిపోయెను. అతడు వెడలుసరికి చాల మంది అతని గుమ్మముముందు గుమిగూడిరి. ఇది యేమా యని అతడు చూడగ అతని యేకపుత్రుని శవమును కొందరు

మోసికొని వచ్చుచుండిరి. ఆవృద్ధుడు చూచి కొంతతడవు విచారముతో మాటాడలేదు. తరువాత కారణ మడిగెను. అతనిని ఒకసైనికుడు చంపెనని వారు చెప్పుటతోడనే తన్ను శరణుజొచ్చిన వాడే హంతకుడని అతడు గ్రహించెను. కాని ఆసంగతి వివరికి నతడు చెప్పలేదు.

అర్థరాత్రమున ఆతడొంటరిగబోయి సైనికుని పిలచి "ఓయి! నీవు చంపినది నాయేకపుత్రుని. నీవు శిక్షార్హుడవు. కాని నన్ను శరణుజొచ్చినందున నీవు రక్షింప బడితివి. నీకొరకు నాగుఱ్ఱములలో మేలైనగుఱ్ఱమును సిద్ధముచేసితిని. దారిభత్యమునకు వలసిన డబ్బుకూడఇచ్చుచున్నాను. వానిని తీసికొని ఒరులకంటపడకుండ ఎక్కడికైన పొమ్ము" అనెను. ఆమాటలు విని సైనికు డాతని పాదములపైపడి కృతజ్ఞత తెలుపుకొని అతడు చెప్పినట్లు చేసెను,

ఘనులు ఆడినమాట తప్పరు.

---

# ౬ నీలితొట్టిలో పడిననక్క.

నక్కలు పగలంతయు బొరియలలో దాగియుండి చీకటిపడినంతనే ఆహారముకొరకు ఇటునటు తిరుగును. ఒకనాడొకనక్క ఆహారముకొరకు చాలచోటుల వెదకెనుగాని ఏమియు కన్పింపకపోవుటచే చాలవిచారముగ నుండెను.

ఆస్థితిలో నది యొకచాకలివాని పెరటిలోనికి పోయెను. వానిదొడ్డిలో నీలిమందుతొట్టికలదు. అందేమికలదోయని నక్కతొంగిచూడపోయెను. కాలుజారుటచే అదియందుపడి రాత్రియంతయు గడపెను.

మరునాడుదయమున చాకలివచ్చునప్పటికి జిత్తులమారినక్క చచ్చినట్లు పడియుండెను. అదినిజముగ చచ్చెనని తలంచి దానిని అవలపారవేయించెను. వాడు వెడలినతరువాత నక్క మెల్లగలేచి కాలికొలది పరుగెత్తి అరణ్యములోనికి పోయెను.

నీలితొట్టిలోపడుటచే ఆనక్కకు నీలిరంగువచ్చెను. అదిచూచుకొని నక్క తనతోడినక్కలను పిలచి ఇట్లనెను. "హితులారా! రాత్రి నేనొక అద్భుతమును చూచితిని. కాళికాదేవి నాకు కన్పించి ఈ యరణ్యమునకు నిన్ను రాజుగా నియమించితిని. అందుకుగుర్తుగా నీకు నీలవర్ణమును ప్రసాదించితినని చెప్పెను". ఆనక్కలది సత్యమనుకొని దానిని తమకు రాజుగాచేసికొనెను.

దాని నీలవర్ణమునుచూచి మిగిలినజంతువులుకూడ దానిని గుర్తింపలేక భయపడి దానిని రాజుగా ఒప్పుకొనెను. పులియును, సింహమునుగూడ దానికి భయపడెను. అందుచే నక్కకు గర్వమతిశయించెను. అది తనతోడినక్కలను, మిగిలినజంతువులను తృణీకరించి అవమానింపసాగెను. అందుచే

తెలివిగల ఒకముసలినక్క దీనిని అవమానము పరుపవలెనని యెంచి ఒకయుక్తి పన్నెను.

ఒకనాడు నక్క సింహాసనముమీద కూర్చుండి సభ చేయుచుండెను. సింహము, పులి మొదలగు పెద్దజంతువులు కూడ దానికెదురుగ చేతులుకట్టుకొని నిలుచుండెను. అపుడా ముసలినక్క కూతపెట్టెను. పూర్వపుగుణము పోకుండుటచే సింహాసనముమీదనున్న నక్కకూడ కూతపెట్టెను. ఆకూత విని సింహము దానిని నక్కయనిగ్రహించి "నన్నింత కాలము నుండియు మోసగించితివా?" అనుచు దానినిపట్టి చంపెను.

మోసము దాగదు.

---

# 9 కటికవాడు - న్యాయవాది.

కుక్క చాలవిశ్వాసముగల జంతువనియు, ఇండ్లకు కాపుండుననియు ఎంచి పలువురుపెద్దమనుష్యులు కుక్కలను పెంచుదురు. కానివానియెడ అశ్రద్ధచూపినచో వానివలన తగవులు పెక్కులువచ్చును.

ఒకానొక నగరమున ఒకతెలివిగల న్యాయవాదికలడు. అతనియొద్ద శ్వానమొకటిఉండెను. ఒకనాడది బజారులోతిరుగుచు ఒకకటికవాని దుకాణమువద్ద మాంసపుముక్కను దొంగిలించుకొని వచ్చెను.

ఆకటికవాడు న్యాయవాదియొద్దకువచ్చి ఇట్లు మాటలాడెను. "అయ్యా! నాకొకవిషయమున మీసలహాకావలసి వచ్చినది". "ఏవిషయమున" అని న్యాయవాది అడిగెను. నేనుమాంసము నమ్ముకొను కటికవాడను. ఒకకుక్క నాదుకాణమునకువచ్చి మాంసఖండము నెత్తుకొనిపోయెను. ఆనష్టము నేనెవ్వరియొద్దనుండి రాబట్టవలెను?"

"ఆకుక్కయొక్క యజమానినుండి నీవానష్టమును రాబట్టవలెను"

"నిజము. మీరు న్యాయవాదులలో శ్రేష్ఠులు. అయ్యా! ఆకుక్క తమదే. నామాంసపుముక్క మూడు శేరులబరువున్నది. దానివిలువ ఒకరూపాయి".

న్యాయవాది ఆమాటలువినినంతనే తనజేబునుండి ఒకరూపాయితీసి బల్లపై వేసి ఆతనిని తీసికొనుమని సైగచేసి "ఓయి! నీకు కలిగిననష్టమునకును శ్రమకును క్షమింపుము. నాకుక్క నికమీద జాగ్రత్తలోనుంచుదును" అనెను.

కటికవాడు తనతెలివితేటలకు సంతసించి కన్నుగీటుచుపోవుచుండెను. న్యాయవాది వానిని నాలుగడుగులు పోనిచ్చి మరలవెనుకకుపిలచి ఇట్లనెను, "ఓయి! నీవునన్నడిగిన సలహాకు ప్రతిఫలమీయలేదు. దానికి అయిదురూపాయలగును". ఆ మాటలువిని కటికవాడు బిక్కమొగముపెట్టి అయిదురూపాయలనిచ్చి విచారముతో వెడలిపోయెను.

ఎక్కువతెలివి పనికిరాదు



# 10 పాము—ఎలుక.

పాములపట్టుకొని విషముపించుటయందు నేర్పరియగు వాడొకడు కలడు. అతడు విషసర్పము నొకదానిని పట్టుకొని వెదురుపెట్టలో పెట్టెను. దానికి ఆహారమునకుగాను ఒ ఎలుకను పట్టుకొని ఆపెట్టెలోపడవైచి మరలమూతబెట్టెను.

అకలిచే బాధపడుచున్న ఆయురగము మూషికమును పట్టుకొని చంపబోయెను. ఎలుకమాత్రము బెదరక ఆత్రాచుతో నిట్లనెను "ఓఫణీంద్రమ! నన్నుచంపకుము. నాతో చెలిమిచేసినచో నీకుపకారము చేయుదును. ఒకవేళ నీవు త్వరపడి నన్ను చంపినచో నీకాకలిపూర్తిగా తీరదుసరిగదా నీచెర యెన్నటికిని పోదు. కనుక నేనుచెప్పినట్లు చేయుము."

పాము "నేను దీనికన్న ఎక్కువ బలవంతుడను నేను చేయలేని కార్యమిది ఎట్లుచేయగలదు? అయిన నదియేమో చూచెదను" అనుచు తనలో ననుకొని మూషికముతో నిట్లనెను. "నీవేమి చేయతలచితివి?"

"ఓసర్పరాజా! నేను బలహీనుడ. నేమిచేయగలనని తలపకుము. ఎవనికి దేనియందు నిపుణత్వముండునో వాడు దాని యందు పూజ్యుడు. సన్నని సూదిచేతనగుపని చిక్కని దబ్బనముచేత కాదుగదా! అటులే నేచేయునది బలుడవయ్యును నీవుచేయలేవు. ఓర్చికొలదిసేపుండుము. అవల నీకు చెర విముక్తి యగును-నీవు కండ్లుమూసికొనుము. నేను మంత్రము

జపించి నీకు సైగచేయుదును అపుడు నీవు పెట్టెనుండి బైటికి పోగలుగుదువు" అని ఎలుక పలికెను.

పాము కండ్లుమూసికొని యుండెను. ఎలుక మెల్లగ పెట్టెకు రంధ్రముచేసి పైకిపోయెను. కొంతసేపట్లుండి పాము కనులు తెరచి చూచుసరికి ఎలుక గోచరింపదయ్యెను. పాముకు ఎలుకవచ్చిన త్రోవనే పైకివచ్చి నోటికి దొరకిన ఎలుక పోయెనుగదాయని చింతింపదొడగెను. ఆపాపపుపాము ఎలుక తనకుచేసినమేలు మరచి ఎలుకను చంపతలచి ఎలుకకన్నము దగ్గరకు పోయి "ఓమూషికమ! నీవు నాకు ప్రాణసఖుడవు. నీవుచేసిన యుపకారమును మరువలేను వేగమరమ్ము. మనమిరు వురము నాడుకొందము" అని పిలచెను.

ఆమాటలువిని ఎలుక పామునకు కనబడకుండ దాగి ఇట్లని బదులాడెను. "ఓసర్పమ నీవు నన్ను చంపక విడచితివి. నేను నిన్ను చెరనుండి విడిపించితిని. మనకుగల స్నేహమంత మాత్రమే. నేను బలహీనుడను నీవు బలవంతుడవు అట్టివారికి చెలిమితగదు. అదియునుగాక మునుపటినుండియు ఎలుకలకును పాములకును విరోధముగలదు. నన్ను నీవు వదలుదువా? కనుక నేను నీదరికిరాను ఇక నీదారినిపొమ్ము"

ఆపలుకులువిని పాము సిగ్గుపొంది వెడలిపోయెను. ఎలుక తనవారినిగూడి సుఖముగ ఉండెను.

**వేరొకమార్గము లేనపుడు పగవానిని నమ్మవలెను,**
**తరువాత వానిని నమ్మరాదు.**

---

# 11 కుందేలు—సింహము.



ఒక యరణ్యమున సింహమొకటి నివసించుచుండెను. జంతువులన్నిటిలోను సింహముచాలబలముగలది. అందుచే దానిని మృగరాజని పిలుతురు.. దానినేమృగము నెదిరించి పోరాడచాలదు.

ఈ సింహముకూడ అనుదినము ననేకజంతువులను చంపుచుండెను. అందుచే మృగములన్నియు సభచేసి ప్రతి రోజు నేదేని ఒకజంతువును ఆసింహమునకాహారముగా పంపు టకు తీర్మానించుకొనెను. ఆవిషయమును సింహమునకాజం

శావులు చెప్పుకొనెను. సింహామితరజంతువులను చంపుట మానెను.

ఒకదినమున సింహామునకాహారముగా పోవుటకొక కుందేలువంతువచ్చెను. అది సింహాము నెటులైనను చంపి జంతువులబాధ పోగొట్టవలెనని ఆలోచించెను. చివరకుదానికి ఒకయుపాయము తోచెను.

కుందేలు సింహామువద్దకు చాల ఆలస్యముగపోయెను. ఆలస్యమగుటచే మృగరాజున కాకలి హెచ్చుగనుండెను. ఆకలిబాధకు కోపముకూడ తీవరించెను. కుందేలునుచూడగనే సింహాము గర్జించి "ఇంతఆలస్యమెందుకయ్యెను"? అనెను. కుందేలు భయపడినటుల నటించి "మృగరాజా! నన్ను మన్నింపుము. నేనింటివద్ద పెందలకడనే బయలుదేరితిని. త్రోవలో ఇంకొకసింహాము కన్పించి నన్నుపట్టుకొనెను. చాలశ్రమపడి విడిపించుకొని వచ్చితిని" అనెను.

మరొకసింహాము కలదని వినినంతనే దానికి కోపము మరింత హెచ్చి "ఏడీ? వాడేడీ? నాకుచూపుము" అనెను. కుందేలు వానినొకనూతివద్దకు తీసికొనిపోయి "ఇందున్నాడు చూడుడు" అనెను. సింహాము అందుతొంగిచూచెను. అందలి నీటిలో తననీడనుచూచి అదేక్రొత్తసింహామనియెంచి దానితో పోరాడుట కందు దుమికిచచ్చెను.

భుజబలముకన్న బుద్ధిబలము హెచ్చు.

---

# 12 విల్లు

ఒకానొక నగరమున ధనికుడగు వృద్ధుడొకడు గలడు. అతని కొకే కుమారుడు. వృద్ధుడు చనిపోవునప్పటికి కుమారుడు చిన్న వయస్సు నందుండెను. అందుచే ముసలివాడు తనవద్ద నున్న స్నేహితుని పిలచి "మిత్రమ! నాకు చాల జబ్బుగా నున్నది. జీవింతునను నాశలేదు. నాయాస్తినంతను నీకు ఒప్పగించుచున్నాను. నాకుమారుడు పెద్దవాడగువరకును దానినంతను నీవే జాగ్రత్తపెట్టుము. తరువాత నీకెంత యిష్టమో అంతయు వానికిచ్చి మిగిలినది నీవుతీసికొనుము" అనిచెప్పెను. పిమ్మట కొలదికాలమునకతడు చనిపోయెను.

ముసలివాని యాస్తియంతయు నొకలక్షరూప్యముల విలువగలిగి యుండెను. ఆమిత్రుడు దానినంతను జాగ్రత్తపెట్టి యాముసలివాని కుమారుడు పెద్దవాడయిన తరువాత "ఓయి! మీతండ్రి చనిపోవుటకుముందీ ఆస్తినంతను నాకునప్పగించి నాకెంతయిష్టమో అంతయు నీకిమ్మనెను. నీకు పదివేలిచ్చెదను మిగిలినది నేను తీసికొందును" అనెను. అది అన్యాయమనియు తండ్రివ్రాసినవిల్లు చెల్లకూడదనియు కుమారుడు వ్యాజ్యము వేసెను.

న్యాయాధికారి ఆవిల్లు చూచి ఆమిత్రునితో నిట్లనెను. "ఓయి! ఎంతడబ్బుతీసికొనుటకు నీవిష్టపడుచున్నావు?"

"మహాప్రభూ! తొంబదివేలుంచుకొనుటకు నేనిష్టపడుచున్నాను" అని వాడనెను.

"సరే విల్లు ఏమిచెప్పుచున్నదో వింటివా? నీయిష్టము వచ్చినది కుమారునకీయవలెనని అందున్నది తొంబదివేలు నీకిష్టమువచ్చినమొత్తము కనుక ఆమొత్త మా పిల్లవానికి పోవును. మిగిలిన పదివేలుమాత్రమే నీవు తీసికొనవచ్చును" అని న్యాయాధికారి తీర్పుచెప్పెను.

అదివిని మిత్రుడు ఆశాభంగమునొంది వెల్లె మొగముతో ఇంటికి పోయెను.

అన్యాయమునకు పోగూడదు.

---

# 13. దురాశ.

పేదవాడొకడనుదినము నడవినుండి కట్టెలను కొట్టితెచ్చి బజారులోఅమ్మి జీవించుచుండెను. ఒకనాడు వాడడవికి కట్టెలనుకొట్టుటకు పోవుచు త్రోవలోనున్న వంతెనను దాటుచుండెను .అపుడతనిచేతనున్న గొడ్డలిజారి నీటపడిమునిగిపోయెను.

గొడ్డలిపోవుటవలన కట్టెలనుకొట్టుటకు వీలులేదనియు, అందుచే తినుటకు తిండిదొరకదనియు, తలచి ఆపేదవాడు విచారించుచు కాలువయొడ్డున కూర్చుండెను.

అతనిస్థితి అచ్చటనున్న వనదేవతచూచి అతనికిప్రత్యక్షమై విచారించుటకు కారణమడిగెను. వాడుకారణముచెప్పెను. ఆదేవత "నీగొడ్డలి తెచ్చియిచ్చెదను. ఆగుము" అనుచు మాయమాయెను. కొంతసేపటికి బంగారుగొడ్డలి ఒకటితీసికొనివచ్చి "ఇదినీదేనా?" అని అడిగెను. వాడు "ఇదినాదికాదు" అనెను. అనంతరమామె వెండిగొడ్డలితెచ్చెను. అదికూడఅతనిదికాదనిఅతడనెను. అపుడామె వానియినుపగొడ్డలి తెచ్చెను. అదివాడు తనదేయనుచు తీసికొనెను. పేదవాడైనను వాడు నిజమువలికెనని సంతసించి వనదేవత వానికి వెండిగొడ్డలిని బంగారుగొడ్డలినికూడ ఇచ్చి దీవించి పంపెను.

ఆసంగతి అతనిపొరుగింటివానికి తెలిసెను. వాడుసోమరి. అబద్ధమాడును. పరులసొమ్మునాశించును. కనుక తానుకూడ బంగారుగొడ్డలిని సంపాదింపవలెనని తలంచి ఆవంతెనపైనపోయి తనగొడ్డలిని నీటపారవైచి యేడ్వసాగెను.

ఆవనదేవత మరలవచ్చి కారణమడిగి పూర్వమువలెనే బంగారుగొడ్డలితెచ్చి "ఇదినీదేనా?"అనెను. ఆశాపరుడగు నాతడు 'నాదేనాదే' అనుచు పరుగునపోయి దానినిఅందుకొనపోయెను. వాని అత్యాశకు వనదేవతకోపించి "ఓరీ నీవంటివానికి సాయముచేయరాదు" అనుచు మాయమయ్యెను.

ఉన్నగొడ్డలికూడ పోగొట్టుకొని వాడువిచారించుచు ఇంటికిపోయెను.

పరులసొమ్ము నాశింపరాదు.



# 14 ఇద్దరు ప్రయాణీకులు

ఒకనాటిరాత్రి ఒకనగరమునందలి సత్రమున ఇరువురు ప్రయాణీకులు వచ్చిపరుండిరి. వారిద్దరివద్దను చెరొకమూట యు నుండెను. వానిని వారు బహుజాగరూకతతో దాచి పరుండిరి.

తెల్లవారుఝామున వారిరువురును లేచి వెడలనుం డిరి. అందొకడు రెండవవానివంకచూచి "అయ్యా! మీ మూటలో నేమున్నది?" అనెను. "ఇందు బియ్యమున్నవి. రాత్రి పొద్దుపోయి వచ్చితిని వంట చేసికొనలేకపోతిని. ఆకలియగు చున్నది. పెందలకడనే వండుకొని అన్నము తినవలెను" అని వాడుజవాబిచ్చెను.

"అయ్యా! నావద్ద అన్నపుమూట యున్నది. దానిని మీరుతీసికొని నాకు బియ్యమునిండు. నేను ప్రొద్దెక్కినగాని భోజనము చేయను" అనుచు తనమూటను నతనికిచ్చెను. వాడు దానినందుకొని మెత్తగానుండుటచూచి సరేయని యొప్పుకొనెను. మొదటివాడు గరగరలాడుచున్న యతని బియ్యపుమూటనుగొని వెడలిపోయెను.

మొదటివాడు వెడలువరకు నూరకుండి రెండవవాడు మూటవిప్పిచూచెను. అందుఅన్నమునకుబదులు పేడముద్ద యుండెను. "అన్నా! వాడు నన్నే మోసముచేసెనురా! నేనే

మోసగాడ ననుకొంటిని. వాడు నన్ను వంచిన మోసగాడు." అనెను.

మొదటివాడు ఊరిబయటకుపోయి పేడమూటకు బదులు బియ్యపుమూట వచ్చెననుచు సంతోషముతో దానినివిప్పిచూచెను. అందు బియ్యమునకుబదులు ఇసుకయుండెను. అంతటవాడు తెల్లబోయి "ఓరి! వాడసాధ్యుడు నేను పేడతక్కిడగాడను, వాడు ఇసుకతక్కిడుగాడు. నాకుతగినశాస్తిచేసినాడు" అనుచు నింటిదారిపట్టి వెడలెను.

మోసగింపబోయి మోసపోవుదువు.

# 15 కోమటి యుక్తి.

ఒకనాడొకరాజు తనమంత్రినిపిలచి "మంత్రివర! మన రాజ్యమునగలవారిలో యుక్తికి ఎవరధికులో చెప్పగలవా?" అని యడిగెను. దానికి మంత్రి కొంచెమాలోచించి "రాజ! మన రాజ్యమునగలవారిలో కోమటులెక్కువ యుక్తిపరులు" అనెను. "నీవావిషయము నెట్లు ఋజువుపరుతువు"? అని రాజడిగెను.

దానికి మంత్రి రాజుతోనిట్లనెను. "అయ్యా; నేనొకటి చెప్పెదను. అట్లుచేయుడు. రేపుప్రొద్దుట ప్రతికోమటియును

నీరుపాలచొప్పున తెచ్చి మీగంగాళమున పోయవలెనని చాటింపుడు". రాజందులకు ఒప్పుకొని చాటింపువేయించెను.

రాజుగారి యాజ్ఞప్రకారము కోమటులందరును నీరు చెంబులతో వచ్చిరి. ఎవరికీవారు పాలనుపోసి ఇండ్లకుపోయిరి అందరును వెడలినతరువాత మంత్రి రాజును తీసికొనివచ్చి గంగాళమును తెరచి చూచెను. అందు ఒక్కచుక్కయైనను పాలులేవు. అంతయు నీరే. రాజదిచూచి తెల్లబోయి "మిత్రమ! ఇదేమి?" అనెను.

మంత్రి రాజుతో నిట్లనెను. "రాజ! కోమటులుమిక్కిలి యుక్తిపరులు. అందరును పాలను తెచ్చిపోయుదురు. నేనొక్కడను నీరుపోసినను తెలియదు.'' అనుచు ఎవరికివారు తలచిరి. కనుక చివరకందరును నీరు తెచ్చిపోసిరి."

రాజు మంత్రిచెప్పిన దానిలోగల సత్యమును మెచ్చి వానిని గౌరవించి పంపెను.

వర్తకుడు ఉక్తిపరుడుగా నుండవలెను.



# 16 ఘంటాకర్ణుడు

బ్రహ్మపురమునకు సమీపమున శ్రీపర్వతము కలదు. దానిలో చోరులు కొందరు నివసించుచుండిరి. అందులో నొక డొకఘంటను దొంగిలించి వచ్చుచుండ పులియొకటి వానిని చంపితినెను, ఆఘంట యొకకోతికి దొరకుటచే అది దానిని వాయించుచుండెను. మనుష్యుడు చచ్చుటయును, ఘంట చప్పుడు వినిపించుటయును చూచి ఆయరణ్యమున రాక్షసు డొకడు చేరెనని ప్రజలు తలచిరి. వాడుఘంటను మ్రోయించు చుండుటచే వానిని ఘంటాకర్ణుడని పిలువసాగిరి. వాడు మను ష్యులను చంపి తినుచనియెంచి బ్రహ్మపురములోని జనులు పారిపోవ తొడంగిరి.

ఘంటాకర్ణుని చంపవలెనని ఆనగరపురాజు ప్రయత్నిం చెను. వానిని చంపినవానికి చాలడబ్బు ఇత్తునని యాతడు చాటించెను. ఆనగరమున తెలివిగలముసలిది యొకర్తుకలదు. ఆమె ఘంటమ్రోగుటకు కారణము గ్రహించెను. చాటింపు విని ఆమె రాజువద్దకుపోయి తాను ఘంటాకర్ణుని చంపివత్తునని చెప్పి యరణ్యమునకు వెళ్ళెను.

ఆమె తనతో ననేకరకముల పండ్లను తీసికొనిపోయెను. ఆమె తిన్నగ కోతివద్దకుపోయి ఆపండ్లను క్రిందపెట్టెను. వానిని తీసికొనుటకు వానరము క్రిందికివచ్చి గంటనువదలి పండ్లను

పట్టుకొని చెట్టెక్కెను. ముసలిది ఆగంటను తీసికొని దాచి నగరమునకు వచ్చెను. అప్పటనుండియు బ్రహ్మపురజనులు గంటచప్పుడు వినలేదు. అందుచేవారు ఘంటాకర్ణుడు చచ్చె ననియెంచి యామెను చాలగౌరవించిరి. రాజుకూడ ఆమెకు చాలధనమునిచ్చి సన్మానించెను.

స్వల్పవిషయములను జూచి భయపడరాదు.

---

# 17. ధర్మనిర్వాహణము.

హారౌనుఅల్‌రషీదు బాగ్దాదు నగరమునకు సుల్తాను. న్యాయబుద్ధికిని, కారుణ్యమునకును అతఁడు వాసిగాంచెను.

ఒకనాఁడు సుల్తాను సభతీర్చియుండఁగ నొకపేదవాఁడు వచ్చి అతనికి సలాములొనర్చి యిట్లనెను "ప్రభూ! అనుదినమును ఒకసైతాను రాత్రివేళ నాయింటికివచ్చి పిల్లలను స్త్రీలను బాధించుచున్నాఁడు. నేనెన్నివిధముల ప్రయత్నించినను ఆపీడ విరుగడయగునట్లు లేదు." ఆమాటలువిని సుల్తాను కరుణాంతరంగుఁడై యిట్లనెను. "ఓయి! నీకువచ్చినభయములేదు. నాబొందెలో ప్రాణములుండఁగ నీవు దుఃఖింపననసరములేదు. ఈమారు ఆసైతానువచ్చినపుడు నాకుచెప్పుము." అతఁడు వల్లెయని యింటికి వెడలిపోయెను.

మరునాటిరాత్రి యామనుజుఁడువచ్చి సైతాను మామూలుగవచ్చెనని చెప్పెను. చెప్పుటయేతడవుగ సుల్తాను చేతఖడ్గముసుధరించి యతనితో నేగెను. అతనియింటికి పోయిన తరువాత నందున్న స్త్రీజనమునందరను వెలికిరమ్మని చెప్పి, దీపము నార్పించి సుల్తాను గృహము జొచ్చెను. ఆచీకటిలో సుల్తాను ఆసైతానును వెదకి తనకరవాలముతో పొడిచిచంపెను. అపుడు దీపముతెమ్మని చెప్పి ఆవెలుతురులో చచ్చిపడియున్న శవమును చూచి చేతులుపైకెత్తి "ప్రభూ! నీవు పరమ దయాళుడవు"

ను. తరువాత ఆయింటియజమానిని పిలచి "ఓయి! నాకొ
్కెముక్కను, కొంచెము మంచి నీటిని ఇమ్ము" అనెను.

సుల్తాను రొట్టెతినిన వెనుక ఆయజమాని చేతులుజోడిం
గొని "దేవా! దీపమార్పించుటకును, నావంటిపేదవానియిం
జొన్నరొట్టెతినుటకును కారణము చెప్పవేడుచున్నాను"
ను.

అపుడు సుల్తాను ఇట్లనెను, "నిన్న నీవు నీకష్టమును
్పినప్పటినుండియు నేను పచ్చిమంచినీరైనను త్రాగలేదు.
చ్చినసైతాను నాకుమారుడని నేననుకొంటిని. అందుచే
వెలుతురులో అతనిముఖము చూచినయెడల వానినిచంప
పోదునేమో అందువలన ధర్మనిర్వహణము జరుగనేరదేమో
ని భయపడి దీపమార్పించితిని"

ఆపలుకులు వినినవారందరును సుల్తానుని కారుణ్యము
, న్యాయబుద్ధికిని ఆశ్చర్యపడిరి.

రాజు తప్పక ధర్మము నిర్వహించవలెను.

---

# 18. విధి నిర్ణయము.

పూర్వమొకరాజుకలడు. అతనికొకే కూతురుండెను. ఆమె చాలఅందవతి. ఆమెకు ఈడువచ్చినతరువాత తల్లిదండ్రులు వివాహప్రయత్నములుచేయసాగిరి. ఆమెను తనచెల్లెలి కుమారునకీయవలెనని రాజుతలంపు. తనయన్నకుమారునకీయవలెనని రాణీతలంపు. భార్యాభర్తల కిరువురకును సమాధానము కుదరక పెండ్లిచాలకాలమాగెను. ఎట్టకేలకు రాజుగారిపంతము నెగ్గెను. తనకూతును ఆడుబడుచు కుమారునకిచ్చుటకు రాణీ యనుమతించెను.

రాజుసంతోషముతో జ్యోతిష్కులనురావించి ముహూర్తనిశ్చయముచేయించి పెండ్లివారికి కబురంపెను. అదేముహూర్తమునకు పెండ్లివారై తరలిరమ్మని రాణికూడ తనయన్నకు మాటచేసెను. ఇరువురుపెండ్లివారు నొకేసమయమునకు ఊరి బయటకు వచ్చి విడిసిరి. రాజు పెండ్లిప్రయత్నముల సందడిలో నీవిషయమును గ్రహింపలేదు.

పెండ్లివారిరువురు వచ్చుట ఒకగిరుడుడుచూచి యుండే పెండ్లికొడుకునకు వివాహమగునో కనుగొందమని బ్రహ్మదేవునియొద్దకు బోయెను. అతను కొంచెముయోచించి ఇట్లనెను. "ఆపిల్లకు వారివురిలో నెవరునుగూడ మగడుకాడు. ఆరాజు పట్టణమున తూర్పువైపున సత్రపుటరుగుపైనున్న కుష్ఠురోగి

గరుడుడచటనుండి బయలుదేరి సత్రమునకుబోయి కుష్టువానినిగాంచి యెట్లయిన వివాహభంగమును బ్రహ్మవచనావిఘాతమునుచేయనిశ్చయించెను. వెంటనే గరుడుడును ఆకుష్టువానిని నోటకరచుకొని నిర్మానుష్యమగు సముద్రతీరమున వదలివచ్చి, రాజుగారియింటివెనుకనున్న చెట్టుపైవ్రాలి బ్రహ్మమాట లెట్లునెగ్గునోయని చూచుచుండెను.

అంతట రాజుభార్య తనకుమార్తె నొకపెట్టెలోనుంచి నౌకరునెత్తిపై పెట్టి అన్నగారివిడిదిలోనికి పంపెను. గరుడుడు చెట్టుపైకూర్చుండి ఆరోగి అన్నపానములులేక తనప్రాణమునకునూరుమనుచు చచ్చునేమోయని విచారించుచుండెను. ఆసమయమున పెట్టెచూచెను. అందు ఫలహారములుండనోపుననియెంచి గరుడుడు దానిని కాళ్ళతో తన్నుకొనిపోయి కుష్ఠువానియొద్ద విడిచెను.

కుష్ఠువాడు దానినితెరచి అందున్న రాజుకూతురును గాంచి విస్మితుడాయెను. ఆమె తనదుర్గతికిచింతించి తన యిష్టదేవతను ప్రార్థించెను. ఆమె ప్రత్యక్షమై వానివ్యాధినివారించి వారికి సమస్తసంపదల నొసంగెను. వారిరువురును వివాహము చేసికొని సుఖముండిరి.

**విధినిర్ణయము నెవరును తప్పింపజాలరు.**



# 19. దొంగ.

పూర్వకాలమున నొకధనవంతుడు కలడు. ధనవంతులందరివలె నతడును పలువురు నౌకరులను పెట్టుకొనియుండెను. ఒకనాడతనియింట వెండిగిన్నెయొకటి పోయెను. ఆనౌకరులలో దొంగయెవడో తెలియక యతనిని కనుగొనుట కొక పన్నుగడ చేసెను.

ఒకసాయంకాలమున వారినందర నొకచో సమావేశముగావించి యందరకును తలొక పుల్లను ఇచ్చి యిట్లనెను. "సేవకులార! ఈపుల్లలపొడవు ఆరంగుళములు. మీలో దొంగతనముచేసినవానిపుల్ల రేపుఉదయమునకు మూడంగుళములు ఎదుగును. మీరీపుల్లలను తీసికొనిపోయి రేపుప్రొద్దుట తీసికొనిరండు".

పరిచారకులందరును యజమాని మాటలచొప్పున నింటికిపోయిరి. అందు దొంగతనము చేసినవాడు యజమాని మాటప్రకారము కఱ్ఱపుల్ల ఎదుగుననినమ్మెను. మరునాడు పనిలోనికిపోవుటకుముందు పుల్లలో మూడంగుళములముక్కనువిరచి పారవేసి మిగిలినదానిని తీసికొనివెళ్లెను.

భృత్యులందరనుపిలచి యజమాని పుల్లలుతీసికొనెను. అన్నియు ఎదుగకయుండెను. దొంగవానిపుల్లమాత్రము మూ

డంగుళములు తగ్గియుండెను. అదిచూచి ఆయధికారి ఆమనుజుని పదిమందిలోపెట్టి తప్పిదమునతనిచే ఒప్పించి మందలించి పంపెను.

దొంగవానిమనసు పీకించుచుండును.

---

# 20. నిజము చెప్పుము.

పూర్వకాలమున ప్రయాణముచేయుటకు రైళ్ళుగాని మోటారులుగాని, ఉండెడివికావు. ధనవంతులు పల్లకులలోను బండ్లలోను, గుఱ్ఱములమీదను పోయెడివారు. పేదవారు మహారణ్యములలోగూడ కాలినడకనే పోయెడివారు. అట్టివారిని దొంగలు పట్టిబాధించెడివారు.

ఒకానొకప్పుడొక బాలుడు విద్యనభ్యసించుటకు పొరుగూరికి పోవుచుండెను. అతనికి ముదుసలితల్లిగలదు. ఆమెఅతనికొకరూపాయయిచ్చి "నాయనా! ఈరూపాయ దారిఖర్చునకు ఉంచుకొనుము. ఎంతటి ఆపదవచ్చినను అనృతమాడకుము. నిన్ను భగవంతుడు కాపాడును" అనెను. అతడుఆమెకు నమస్కరించి అటులే నడచుకొందుననెను.

ఆబాలుడు మరొకనితోగలసి ఒకఅరణ్యములో పోవుచుండ దొంగలువచ్చి పట్టుకొనిరి. వారు రెండవవానిని "నీవద్ద నేమియున్నది?" అనిరి. వాడుతనదగ్గరనేమియు డబ్బులేదనెను. ఆబాలుని గూడ నటులేప్రశ్నించిరి. అయ్యా నావద్ద ఒకరూపాయిమాత్రమున్నది" అనెను. అప్పుడుదొంగలు వారిరువురను పట్టివెదకిరి. బాలునివద్ద ఒకరూపాయిమాత్రముండెను. రెండవవానివద్ద రెండువందల రూపాయిలుండెను.

అదిచూచి దొంగలనాయకుడు తోడివారితో నిట్లనెను సోదరులారా! ఈబాలుడు నిజముచెప్పెను. కనుక వానిరూపాయివానికిచ్చి పోనిండు. ఆరెండవవాడు అబద్ధమాడెను. కావున ఆడబ్బుహరించి చితుకతన్ని పంపుడు. వారట్లే చేసిరి.

నిజముచెప్పువారిని అందరు మెచ్చుకొందురు.

---

